# గ్రంథాలయసర్వస్వము.

సంపు. ౨. | బెజవాడ—సెప్టెంబరు ౧౯౧౬. | సంచిక 3.

## ప్రజాసామాన్యముయొక్క జ్ఞానాభివృద్ధి.

ప్రజలయందు ప్రైమరీవిద్య వ్యాపించినకొలది వారల కష్టము లన్నియు తీరు నని పెక్కుమంది తలచుచున్నారు. హిందూదేశమందలి ప్రజలు మిక్కిలి ఇబ్బందులలో నున్నారు. వారి దారిద్ర్యము, వారి అపరిశుభ్రత, వారి మౌఢ్యము, వారి పారతంత్ర్యత (స్వతంత్రమగు అభిప్రాయములు లేకపోవుట) ఇవియన్నియు ప్రైమరీ విద్యవలన నశించు ననియు ప్రజలకు సౌఖ్యము, ఆరోగ్యము, బుద్ధివికాసము, ఆత్మవిశ్వాసము చేకూరు ననియు ఎంచుచున్నారు. హిందూదేశమందలి జనులలో నూటికి దాదాపు 99 మంది నిరక్షరకుక్షులుగా నున్నారు. ఐరోపాదేశమందలి ప్రజలు దాదాపు అందరును చదువుకొన్నవారే; ఈ రెండువిషయములనుబట్టి కొన్నియూహాలు చేయబడినవి. అందును బట్టి ప్రైమరీవిద్య ప్రజలకు సర్వసౌఖ్యములను చేకూర్చు నని కొందరు సిద్ధాంతము చేయుచున్నారు. మనదేశమందలి ప్రజలు అనుభవించుచున్న కష్టములనుండి వారలను విముక్తినొందించుటకు ప్రయిమరీ విద్య అప్రతిహత మైనట్టియు అనివార్యమైనట్టియు పరమసాధన మనియు, అంతకంటె వేరొకమార్గము లేదనియు ఇప్పటికాలమున దేశాభ్యుదయమునకై కృషిచేయువారలలో ఎక్కువమంది దృఢాభిప్రాయులై యున్నారు.

ఇంగ్లాండు దేశమందు 1870 వ సంవత్సరమునుండి ప్రయిమరీ విద్య ప్రజాసామాన్యమునకు అందుబాటుగానుండునట్లు చేయబడినది. 1870 వ సంవత్సరమునాటికి ఆ దేశములో చదువుకొన్నవారు నూటికి 20 మందికంటె తక్కువ. అయితే 1870 వ సంవత్సరమునకుపూర్వమే ఇంగ్లాండుదేశము అత్యున్నతదశను గాంచినది. అప్పటికే దిగంత

విశ్రాంత మగు సామ్రాజ్యమును సంపాదించెను. 1870 వ సంవత్సరముకంటె పూర్వమే గొప్ప ప్రకృతిశాస్త్రజ్ఞులును, కళాకోవిదులునుబయలు దేరిరి. ఆ దేశమందలి ఇప్పటికాలపు ప్రజలందరు చదువువచ్చినవారైనప్పటికిని ఎక్కువ అభ్యున్నతి చెందినవారును, ఎక్కువసౌఖ్యము గలవారును అగుదురా? యని శంకించుట సహేతుకముగానే యున్నది.

జనసామాన్యమురొయొక్కయు, పై తరగతులవారియొక్కయు చదువు.

ఇంత ప్రాధాన్యమును వహించుచున్న ప్రయిమరీవిద్యయొక్క స్వరూప స్వభావము లెవ్వి? ప్రయిమరీవిద్య యనగా సామాన్యముగా చదువను, వ్రాయను, లెక్కలుచేయుట మాత్రమె. ఈమూడు విషయములును కూడి విద్యాసాధనము లగుచున్నవియే గాని వాని యంతట యవి విద్య యని తలంచుట పొరబాటు. అయితే ఈమూడు విషయములు మాత్రముకూడి ప్రజలయొక్క విద్య యని ఏల వేషము వేసికొని ఊరేగవలెను. నాగరికతకు చదువుకొన్నవారు మాత్రమే కారకులుగారు. నానావిధ మగు ప్రజలందరును కారకులు. చదువుకొన్నవా రనగా మానసికశక్తులను తరిబీతు చేసికొన్నవారు. తక్కిన ప్రజలు శరీరమును సాధనచేసినవారు. తరిబీతు చేసికొన్న శరీరము గలవారికంటె తరిబీతు చేసికొన్న మనస్సు కలవారలకు ప్రపంచసౌఖ్యములు ఎక్కువగా నబ్బును. చదువుకొన్నవారు తమపిల్లలను తమ వృత్తులనే అవలంబించునట్లు చేసెదరు. విద్యావిధానము తరిబీతు కాబడిన మనస్సు కలవారలచేతనే అట్టివారికి అనుగుణ్యముగా నుండునటుల ఏర్పరుపబడినది. కేవలము వారికాయకష్టముమీదనే జీవించు జాతులకు గూడ చదువు చెప్పవలసి వచ్చినప్పుడు ప్రథమమందు కేవలము మనస్సును తరిబీతుచేయు జాతులకొరకు ఏర్పడిన విద్యావిధానమునందు కొంతభాగమును కొట్టివేసి మిగిలిన దానిని మాత్రమే ఏర్పరచిరి. స్త్రీలకు విద్యావిధానమును ప్రత్యేకము ఏర్పఱచకుండ పురుషులకు ఏర్పరచబడిన విధానమునే వారికిని ఏర్పరచిరి. జనసామాన్యమును స్త్రీలును తమకు ఇచ్చుచున్న విద్య తగినది అగునో కాదో ఆలోచించుకొని తగనియెడల ఎందుచేత తగదో అను విషయమును తీవ్రముగ

ప్రశ్నింపవలెను. స్త్రీలు ఈసమస్యను తీవ్రముగ చర్చించి తమ విద్యా విధానమునందు మార్పులకొరకు ఆందోళనమును ప్రారంభించిరి. కాని ప్రజాసామాన్యమునకు సమర్థత లేనందువలన వారల విద్యావిధానము నందు జరుగవలసిన మార్పులనుగూర్చి ఆందోళన చేయలేక యున్నారు. మనసంఘమందలి పైతరగతులవారి విద్యను ఒకఫలముతో పోల్చినయెడల జనసామాన్యముయొక్క విద్య కేవలము దాని యొక్క "తోలు" అని చెప్పవలెను. తోలులో పండు ఎప్పుడును ఇమిడి యుండునుగాని తోలు ఎప్పటికిని పండుమాత్రము కానేరదు.

ప్రయిమరీ పాఠశాలలో విద్యనేర్పుట ప్రజలయొక్క మనస్సును దున్నుటవంటిది. విత్తనములు వేయుటగాని పైరు పెంచుట గాని అందులో చేరిలేదు. ఈ దున్నుటవలన మాత్రమే ఆహారము భుజింపవలె నను వాంఛ వారికి ఉదయించు ననియు, అట్టి ఆహారము లభించినప్పుడు అది స్వాదుగా నుండుననియు, అనిర్వచనీయ మగు ఆశను మనము కలిగియున్నాము. అయితే చంటిపిల్లలకు 'పండ్లు' రావ టముతోనే తియ్యని పదార్థములు తినవలెననియే వారికి ఎప్పుడును జిహ్వాచాపల్యము కలిగియుండును. కేవలము తినుటకు శక్తి ఇచ్చిన మాత్రము చాలదు. వారల అవసరములకు తగినట్లు కావలసినంత పదార్థమును వారలకు ఇచ్చి వారల "పండ్ల"కు తగిన పరిశ్రమ నియ్య వలెను. ఐరోపాదేశమందలి సామాన్య ప్రజలకు వార్తాపత్రికలను, సామాన్యులుకూడ అర్థము చేసికొనుటకు తగిన గ్రంథములను గూడ సప్లయిచేసి, వారల మనస్సునకు ఆహారము కల్పించియున్నారు. అయితే ఈవార్తాపత్రికలను నడిపించువారు కేవలము వార్తలను మాత్రమే ప్రచురింపక, తమ స్వలాభముకొరకు ఉపకరించు విషయ ములను గూర్చి ప్రచురింతురు. కావున ఈపత్రికలు కేవలము కృత్రి మములుగా నున్నవి. ప్రజలయందు జ్ఞానవాంఛ బాగుగా పుట్టిననే గాని, సామాన్యజనులు అర్థము జేసికొనదగిన జ్ఞానాభివృద్ధికరములగు గ్రంథములను వారు ఉపయోగించుకొనరు. అందుచేత ఎక్కువ ఉద్రేకము కలుగునట్టి నవలలను, వార్తలను చదువవలెనని వారికి ఎప్పుడును వ్యసనము కలుగుచుండును. కావున కేవలము చదువు

కొన్న మాత్రమున వారికి నిజమగు లాభము కలుగక అపకారమే ప్రాప్తించుచున్నది.

చదువుట, వ్రాయుట, లెక్కలుచేయుట అను నీ మూడింటిని నేర్చుకొనుటవలన ఐరోపా దేశీయులు ఎంతలాభము పొందిరో అంత నష్టముకూడ పొందిరి. వారు అందుమూలమున నిజమగు జ్ఞానమును సంపాదించుకొన జాలరైరి. విజ్ఞానము ఉండినగాని ఇట్టి ఫలము సిద్ధింపదు. చదువురాని భారతవర్షమందలి ప్రజలు చదువుకొనిన ఐరోపా దేశ ప్రజలకంటె ఎక్కువ పరిజ్ఞానము కలవారని చెప్పుట సామాన్యముగా మనము వినుచున్నాము.

అయితే భారత వర్షమందలి ప్రజల పరిజ్ఞానము అనాది నుండియు తరతరములుగా వచ్చినదై యున్నది. ఇప్పటి కాలపు చదువులవలన అదిమారలేదు. పల్లెటూరి బడిలో ప్రయిమరీ విద్య నభ్యసించిన వాడు చదువురాని తనతండ్రిని జూచి అస హ్యించుకొనును. వీరిస్థితి ఎట్లున్న దనగా చేతిలో కత్తి పుచ్చు కొని తండ్రియెదుట సాముచేయుచు జడిపించువాని వలె నున్నది. ఇందువలన వీరికి కలుగు ఉపయోగ మేమియు లేదు. అయి నప్పటికిని దేశమందలి ప్రజలందరకును చదువు రావలె నని మనము నిరంతరము జ్వరవేడిమితో కొట్టుకొనుచున్నాము. అందుకు కావలసిన ధనము మనకు లేదు. సామాన్య ప్రజలకుఎట్టి చదువుకావలెనో ఆలోచించుటకు తగిన సావకాశమును లేదు. ప్రజాసామాన్యము యొక్క చదువు అనుమాట ఈకాలమునకు సుల భముగా లభించతగిన తారక మంత్రముగా వెలసినది. దాని సిద్ధి కొరకు మన మందరమును ఘోష పెట్టుచున్నాము.

## ప్రజాసామాన్యము యొక్క చదువు - జాతియొక్క అభ్యున్నతి.

కేవలము చదువుకొన్నంత మాత్రముచేత వ్యక్తికి సౌఖ్యము కలుగ నేరదు. దానివలన ప్రజాసామాన్యము యొక్క మనస్సులలో ఒక విధమగు దురద ఏర్పడును. ఈదురదను మాన్పుకొనుటకు ఏ మసి గుడ్డనైన పెట్టి రుద్దుకొనుటయే మంచి సాధన మని సామాన్యులు

అను కొందరు గాని, సరియైన అంజనమును రాచుకొనవలె నని కోరిక బహుకొద్దిమందిమాత్రమునకే కలుగును. ఒక చేనును దున్ని వదిలిపెట్టిన యెడల, అందులో పనికివచ్చెడిపైరు పెరుగుట దుస్సాధ్యము; పనికిమాలిన కలుపుమొక్కలు పెరుగుటయే సామాన్య విషయము. భూమిని దున్ని దానియంతట దానిని వదలుట కంటె, దున్నకుండ వదలుటయే శ్రేయస్కరము. ముద్రణాయంత్రమును కనిపెట్టక పూర్వము విజ్ఞానమును పొందిన జాతు లెన్నియో ప్రపంచమున కలవు. ఇప్పుడు అభ్యున్నతి గాంచిన ఐరోపా దేశీయ జాతులవారు, ఆ దేశ ప్రజలకు చదువురాకమునుపే ఆ ఉన్నతపదవిని పొంది యున్నారు. కాబట్టి జాతియొక్క అభివృద్ధికి ప్రజల "చదువు" అనివార్యమైన కారణముకాదు. "చదువు" సంపూర్ణమైన యోగ్యతను ఇయ్యజాలదు. అది వాంఛనీయమైన సాధన విధానములో ఒక భాగము. ఆవిధాన మంతయు సంపూర్ణత చెందనియెడల అది నిరుపయోగము. ఇట్టి స్థితిలో ప్రజాసామాన్యము యొక్క విద్యా సమస్యను ఎట్లు ఎదుర్కొన వలెను?

## ప్రజాసామాన్య విద్యయొక్క ఉద్దేశములు - మార్గములు.

విద్య దేశకాల పాత్రములతో మారునదిగాని, సర్వకాల సర్వావస్థల యందును అభేదముగా నుండునది గాదు. హిందూదేశ ప్రజలకు ప్రత్యేక సాంప్రదాయము లున్నవి; ప్రత్యేకచరిత్రయున్నది. వారిలో నూటికి తొంబదిమంది పల్లెటూళ్ళలో నివసించుచు వ్యవసాయమువల్ల జీవించుచున్నారు. మిగిలినవారు బస్తీలలో కాపురముచేయుచు పారిశ్రామికవృత్తులమూలమున జీవించుచున్నారు. పిల్లలు పెద్దవారైన పిమ్మట జీవయాత్రకు ఉపకరించు విద్యనే వారి బడులలో వారికి నేర్పవలెను. పల్లెటూరు పిల్లవానికి కావలసిన చదువు చాలకొద్ది; అది చాల తేలిక యైనది. సంకీర్ణమైనది గాదు. అట్టి పిల్లవాడు చదువుకొను పుస్తకములో కొలదిమాత్రము పదార్థవిజ్ఞాన శాస్త్రమును, కొద్దిగా శరీరశాస్త్రమును, కొద్దిగా ఆరోగ్యశాస్త్రమును కొద్దిగాకాలమాన శాస్త్రమును, కొద్దిగా ఖగోళశాస్త్రమును,

ఇట్టిఇతరవిషయములు మరికొన్నియును ఉండవలెను. ఇట్టిగ్రంథము కేవలము ఆతని బుద్ధివికాసముకొరకు రచించు గ్రంథముగా నుండును. దీనికి తోడు విజ్ఞానమును బోధించు గ్రంథము మరియొకటి ఉండవలెను. భారతవర్షమందలి పిల్లవాడు భారతవర్షముయొక్క నైసర్గికమగు బాహ్య స్థితిగతులలో మాత్రమేగాక చరిత్రమూలమున లభించిన వాతావరణమునందుకూడ అభివృద్ధి గాంచవలసియున్నది. ఆతను ఇంగ్లండు దేశపు పిల్లవానికుండెడు ఆదర్శములు, ప్రవర్తన నేర్చుకొనుట నిరర్థకము. ప్రతిజాతికిని విలక్షణ మగు సాంప్రదాయము లుండుటచే నానాజాతు లుండుటకు కారణమైనది. వివిధ జాతులయొక్క ఆశయములు ఆయాజాతుల ప్రసిద్ధపురుషుల రూపముగను ప్రఖ్యాతమగు కార్యరూపమునను మూర్తీభవించును. భారతజాతియొక్క పరిజ్ఞానము, భారతజాతియొక్క జీవితప్రవాహము, భారతీయుల నాగరికతయొక్క నడవడి- ఇవియన్నియు భారతీయ బాలుని ముఖమునుండి వ్యక్తము కావలెను. వీనిలో చాలవరకు భారతీయుల మతమందును, భారతీయుల సాహిత్యమందును, భారతీయుల చరిత్రయందును గోచర మగును. వీనినే భారతీయ జనసామాన్యమునకు బోధింపవలసియున్నది. భారత జాతి ప్రపంచమునందలి వివిధ జాతులయందు ఏయే ఆశయముల కొరకు ఆదర్శముగా నిలచియున్నదో, ఏయే ఫలసిద్ధికొరకు ఆది కాలమునుండియు ఎట్లు కృషిచేయుచున్నదో, ఇదియంతయు ప్రజా సామాన్యము బడులలో నేర్చుకొనువిద్యలో అత్యంతావసరమైన భాగముగానుండి తీరవలయును. ప్రస్తుతము మనదేశమున పాశ్చాత్యుల పరిజ్ఞానము అన్నివిధముల వ్యాపించియున్నది. అయినప్పటికి, భారతవర్ష పరిజ్ఞానముయొక్క ప్రబోధమువలన, నూతన పరిస్థితులలో అభివృద్ధి నొందుచున్న ఈకాలపు భారతీయ బాలునియొక్క బుద్ధివికాసమునందు ఎట్టి వైషమ్యమును కల్గనేరదు. వైషమ్యము కలుగుటకు బదులు అట్టి పరిస్థితులకు ప్రాచీనపరిజ్ఞాన ప్రబోధముచే అత్యంత శోభ లభించును.

తీక్షణ మగు మనస్సును, పరిజ్ఞానము గలబుద్ధిని- మనుష్యునకు సమకూర్చుటయే విద్యావిధానము. 1. చదువుట 2. వ్రాయుట

3. లెక్కలుచేయుట- ఇంతమాత్రము నేర్పుకొనుటవలన మనస్సు తీక్షణముకాదు; పరిజ్ఞానము లభింపదు. పైమూడు విషయములను నేర్పుట-మనస్సును తీక్షణముగా చేయగల గ్రంథమును చదివించుట-విజ్ఞానమును లభింపజేయు గ్రంథమును బోధించుట- బాలురకు కోమల వయస్సునందే అలవడజేసితీరవలసినవై యున్నవి. ఇవి బుద్ధిని వికాసము నొందించగల యంత్రము, ఇటుకలు, ఇండ్లును అయియున్నవి. ఇటుకలకంటె ఇల్లు ఎట్లు ఎక్కువ ప్రధానమైనదో, మనస్సును తీక్షణము చేయుటకంటె పరిజ్ఞానము అలవడజేయుట ఎక్కువ ప్రధానమైనది. పరిజ్ఞానమే మన వాంఛలను పరిశుద్ధపరచును. విచక్షణాజ్ఞానమును వృద్ధిపరచును. మనుజుని కాయిక, మానసిక, ఆధ్యాత్మిక, శక్తుల యొక్క సామరస్యమే విజ్ఞానము. భారతీయ జనసామాన్యము యొక్క విద్య అనాదినుండియు ఆధ్యాత్మిక పరిజ్ఞానమున కనుగుణ్యాముగవ్యాపించి యుండుటచే పైనచెప్పిన సామరస్యము భారతీయునకు అనాదినుండియు అబ్బియున్నది. ఐరోపాదేశీయుల కున్నచదువు (చదువుట, వ్రాయుట, లెక్కలుచేయుట) లేకపోయినను భారతీయులకు విజ్ఞానము గలదు. ఇప్పటికాలపు పాశ్చాత్య విద్యాధురంధరులగు భారతీయులు మన స్త్రీలకంటె ఎక్కువ చదువుకొన్నవారేను. అయితే మన స్త్రీల కున్నంత ప్రశాంతమైన మనస్సు వారలకు లేదు. ఇందుకు కారణ మే మనగా నూతనపద్ధతులు వారల నావరించక పోవుటయే. పాశ్చాత్యపరిజ్ఞానము భారతీయులను అన్నివిధముల వ్యాపించియున్నప్పుడు భారతజాతియొక్క అభ్యుదయము లభింపవలె నన్న (మనము) భారతవిజ్ఞానముయొక్క సాంప్రదాయములకు ప్రాధాన్యము నిచ్చుచు దానిని విపులముగా జేయవలసియున్నది. జీవయాత్రను నడుపుటకు ఉపకరించు విద్య మనుజునికి కాయికముగాను, ఆధ్యాత్మికముగాను అభివృద్ధి నిచ్చు పరిజ్ఞానమునకు సామరస్యముగా నుండును.

మనస్సును తీక్షణపరుపకుండను, విజ్ఞానముచే బుద్ధిని వికసింపజేయకను కేవలము చదువను వ్రాయను లెక్కలుచేయుటను మాత్రము నేర్పుటవలన ప్రయోజనకారి కా దనియు, మీదుమిక్కిలి ఉపద్రవకర మగుననియు గూడ నేను నిరూపించితిని. ప్రజాస్వామిక

ప్రభుత్వమునకు మూలాధారము ప్రజలకు చదువు నేర్పుటయే నని చెప్పుచుండుట మన కలవాటుపడినది. చదువు నేర్చుకొనుట యనగా రోడ్లు, రైలురోడ్లు వేయుట వంటిది; బస్తీలమనుష్యులు పల్లెటూళ్ళకు ఆమూలమున వెళ్ళి తమవస్తువులను అక్కడ అమ్ముకొన వచ్చును. చేరవగల పల్లెటూరువాళ్ళు ఆమూలముననే అప్పుడప్పుడు బస్తీలకు రావచ్చును. మొత్తము మీద వీని వలన ఉభయులకు లాభమున్నను బస్తీ జనులకే ఎక్కువ ప్రయోజనకరము. రైలువలన వర్తకుడును, రైతును గూడ లాభము పొందుచున్నప్పటికిని, ఎక్కువ లాభము వర్తకునిది. "ఓటరు" చదువు కొనుటవలన, వోటరు కంటె "క్యాండిడేటు" నకే ఎక్కువలాభము. ఎక్కువమంది వోటర్లకు తాను చెప్పుసంగతులు తెలియవలె నన్న, దానినిచదువుకొన గలవారు ఎక్కువ మంది ఉండవలె నని "క్యాండిడేటు" కోరును. "బ్యాలటు" పెట్టెకు సంబంధించిన కార్యవిధానమునందు వోటరు చదువుకొన్న వాడుగా నుండిన మంచిది. తమ ఆశయములను ఇతరులకు తెలిపి ఆమూలమున వారిని వశీకరణము చేసికొన గోరెడు వారు చదువుయందు గల సద్గుణములను చాటు చుందురుగాని, ప్రబోధమును పొందెడు ప్రజలు చదువును అంతగా కోరరు. ప్రజాస్వామ్యమును హస్తగతము చేసికొనువారలకు ప్రజలు కేవలము చదువుకొన గలవారుగా నుండుటమాత్రము చాలును. కాని ఇది ప్రజాసామాన్యమునకు మాత్రము చాలదు.

## జ్ఞానము – విజ్ఞానము,

అయితే కేవలము చదువునుమాత్రమే అపేక్షించుట జాతికి ఉచితమైన పనియేనా? ఇప్పుడు మనదేశమందు పెక్కుమంది ప్రయిమరీవిద్యను అందరికిని వ్యాపింప జేయవలెనని ఆతురత పడుచున్నారు గాని దానిని యథార్థమార్గమున ఉపయుక్తముగా నుండునటుల చేయుటకు ప్రయత్నించుటలేదు. మనదేశము మురికిగుంటవలె నున్నట్లు ఎంచుకొనుచున్నాము. దీనిని కదల్చి ఎట్లో ఇందున్న ఉదకమును పరి

శుభ్రపరచవలెనని కోరుచున్నాము. స్థైర్యము మంచిదియో, లేక చలనము మంచిదియో నిరూపణచేసికొనుట సులభమైన పనిగాదు. ఇదియే అనాదికాలము నుండియు మతములయొక్క సమస్యగా నుండి యున్నది. జన్మ జన్మలయందు సుఖదుఃఖముల ననుభవించుచు, ఆమూలమున కలిగెడు తీవ్రమగు అశాంతినుండి తరించి కైవల్యమును పొందుటకే జ్ఞానులు తపస్సుచేయునది. స్వర్గమునందు స్థైర్యమున్నది గనుక అది ఎక్కువ వాంఛనీయముగా నున్నది. నిర్వాణమనగా స్థైర్యముకంటె భిన్నమైనదిగాదు. మనము ఎల్లప్పుడును సౌఖ్యమును కోరుచుందుము. సౌందర్యమును వాంఛింతుము. సత్యమును అన్వేషింతుము. సత్ప్రవర్తనకై ప్రయత్నించెదము. ఈ గుణము లన్నియు స్థైర్యము పొందిన స్థితులే యై యున్నవి. ప్రపంచము గూడ మనకు స్థైర్యస్థితియందే గోచరమగుచున్నది. పరమాణువులు, అణువులు, అన్నియు గూడ బ్రహ్మాండము యొక్క పరిణామమందు స్థైర్యమును పొందిన పదార్థములే. చలనముచే నడుపబడుచున్న అన్యోన్య సంబంధములేని ప్రపంచమందలి వస్తువుల మూలమున మనుజుడు సౌఖ్యము నొందుచుండుట లేదు. అట్లుగాక స్థైర్యము నొందిన పదార్థ సముదాయముల వలననే మనుజుడు ఆనందమును కలిగియున్నాడు; ఒక స్థైర్యస్థితి ఉన్నప్పుడు దానికి భంగముచేసి మరియొక స్థైర్యస్థితికి తేవలెనని మనము కోరుచుందుము. ఈ రెండవ స్థైర్యస్థితికి వచ్చినప్పుడు దానికిగూడ భంగముచేసి, ఇంకొక స్థైర్యస్థితికి తేవలెనని మనము ప్రయత్నించుచుందుము. ఇట్టిచో, జీవిత పరమార్థ మేది? నాగరికతకు ప్రాప్య మేది? స్థైర్యస్థితిని తెచ్చుకొనుటయా లేక అస్థైర్యస్థితిని పొంది ఆమూలమున చంచలత్వమును పొందుటయా? కేవలము చదువు నేర్చుకొనుటవలన చలనమునకు ఉద్రేకము పుట్టును. ఈ చలనమువలన స్థైర్యస్థితి రావచ్చును; రాకపో

వచ్చును. స్థైర్యముకంటె చలనమే వాంఛనీయ మయినచో, కేవలము చదువుకొనుటయే (చదువుట, వ్రాయుట, లెక్కలుచేయుట మాత్రము) కోరదగినదగును. అయితే చలనముకంటె స్థైర్యమే ఎక్కువ వాంఛనీయమైనప్పుడు విజ్ఞానమువలన ప్రాప్తించెడు స్థైర్యమును సంపాదించుకొనుటకు ఉపకరణముగా ఉండగలిగినప్పుడే ఆచదువును మనము అపేక్షింపవలెను. ఉత్కృష్ట మగు ఆదర్శము ఎవరికి సిద్ధించును? శరీరసౌష్ఠవము గలిగి ధనవంతుడై వివేకముగలిగి బుద్ధిసూక్ష్మమును కలిగినవానికా, అట్టి ఉత్కృష్టత లభించుట? లేక మోసగానికిని కష్టువానికిని లభించునా? ఉత్కృష్టమగు ఆదర్శము "రాటము" వలన లభించునా! తుపాకిగుండువలన లభించునా? ఈ ప్రశ్నకు తగిన సమాధానము ఈవరకును రాలే దనియే నా అభిప్రాయము. కేవలము మంచితనమే గలిగిన ప్రపంచము గొప్పదియా? మంచి చెడుగులు గలిగిన ప్రపంచము గొప్పదియా? మతములన్నియు 'అవును' అని ఐక్యకంఠముతో ఘోషించుచున్నవి. అన్నిమతములు ముక్తకంఠతోను గానముచేయు సిద్ధాంతమునే మనము అంగీకరించుట శ్రేయస్కరము. కాబట్టి కేవలము చదువుకొనుట మాత్రమే నేర్చుకొనినచో, జాతికిని వ్యక్తికిని అపాయకరము. తగిన జ్ఞానమును (Knowledge) విజ్ఞానమును (Culture) కూడినప్పుడే చదువుకొనవలెను. లేనియెడల అది లేకుండుటయే మంచిది-శాంతి రామమూర్తి, ఐ. సి. ఎస్.

# "మిచిగాన్" రాష్ట్ర గ్రంథాలయములు

అమెరికా సంయుక్త రాష్ట్రములందు "మిచిగాన్" అనునది ఒకరాష్ట్రము. ఈరాష్ట్రమువారు తమరాష్ట్రమునందు గ్రంథాలయ స్థాపనకు గడంగి నూరుసంవత్సరముల కాలము అయినది. అందుచేత వారు ఈసంవత్సరమున గ్రంథాలయ శతాబ్ద ఉత్సవమును జరుపనున్నారు. కావున ఆరాష్ట్రమందలి గ్రంథాలయోద్యమమును గూర్చి వివరించెదము.

అమెరికా సంయుక్త రాష్ట్రములందు గ్రంథాలయోద్యమ విషయమున పాటుబడుటకు మొదటిది ఈరాష్ట్రమేను. ఈరాష్ట్రము నందున్న "డిట్రాయిట్" పట్టణమున ౧౮౧౭ సంవత్సరమున విశ్వ విద్యాలయ స్థాపనతో పాటుగ ప్రథమ గ్రంథాలయము స్థాపింప బడెను. పిమ్మట ౧౮౨౮ వసంవత్సరమున రాష్ట్ర కేంద్రగ్రంథాలయము స్థాపింపబడెను. ౧౮౩౫ సంవత్సరమునం దారాష్ట్రమువారు తమదేశ మందున్న పట్టణములయం దన్నింటియందును ధర్మ గ్రంథాలయము లను స్థాపింపవలె నని శాసనము గావించిరి.

నేడు ఆరాష్ట్రమునందు, కాలేజీ గ్రంథాలయములును విశ్వ విద్యాలయ గ్రంథాలయములును గాక, ప్రత్యేకము ధర్మ గ్రంథా లయములే ౨౧౯ గలవు. ప్రథమమునందు ఈగ్రంథాలయములన్నియు చందాలవలననో, సంఘముల వలననో, వ్యక్తుల వలననో స్థాపింపబడి నవే యైనప్పటికిని, క్రమముగా ప్రత్యేకము పన్ను విధింపబడి, అం దుండి పోషింపబడుచున్నవి. ఇవిగాక రాష్ట్రమునందెల్లెడల గ్రామము లందును పట్టణము లందును చిన్నచిన్న గ్రంథాలయము లెన్నియో వ్యక్తులవలనను, చందాలవలనను పోషింపబడుచున్నవి గలవు. అవి యన్నియు క్రమముగా పన్నులయొక్క పోషణక్రిందకు వచ్చుచున్నవి.

ఈరాష్ట్రమునందలి గ్రంథాలయములన్నియు ముఖ్యముగా చిన్నచిన్న గ్రంథాలయము లైయున్నవి; ఒకలక్షకంటె యెక్కువ జనాభా గలిగిన నగరములందున్న గ్రంథాలయములు మూడింటికన్న ఎక్కువలేవు. పదివేలు మొదలు ఒకలక్షవరకు జనాభాగలిగిన పట్ట ణములందున్న గ్రంథాలయములు ముప్పదియెనిమిది మాత్రమేను. అయిదువేలు మొదలు పదివేలు జనాభాగలిగిన గ్రామములందున్న గ్రంథాలయములు ఇరువదియెనిమిది. అయిదువేల కంటె తక్కువ జనాభాగలిగిన గ్రామములందున్న గ్రంథాలయములు నూటనలువది తొమ్మిది. పెద్దగ్రంథాలయములు మూడింటిలో "డెట్రాయిట్" పట్టణగ్రంథాలయమునందు ౭,౩౨,౭౩౪ గ్రంథములు గలవు; "గ్రాండురాపిడ్సు" పట్టణ గ్రంథాలయమందు ౨,౯౪,౮౧౮

ములుగలవు; "ఫ్లింటు" పట్టణ గ్రంథాలయమందు ౧,౦౭,౬౯౦ గ్రంథములు గలవు.

ఆరాష్ట్రమునందున్న పురపాలక సంఘములన్నియు గ్రంథాలయములకై ప్రత్యేకముగ పన్నును విధించుకొనుటకు చట్టముగలదు. ఇదిగాక, ఒకపట్టణమునందు గాని, తాలూకాయందుగాని జుల్మానాలవలన (పాఠశాలలందు) వసూలగుసొమ్ము ఆప్రాంతముల గ్రంథాలయములకు ప్రభుత్వమువారిచే పంచిపెట్టబడును. కాని ఇట్టి జుల్మానాలవలన వచ్చునట్టి ద్రవ్యము వివిధ ప్రాంతములలో వివిధ కాలములందు భిన్నముగ నుండుటవలన, విశేష సహాయకరముగ నుండుటలేదు.

ఈరాష్ట్రమునందున్న కొన్ని గ్రంథాలయములు ప్రత్యేకాభివృద్ధిని జూపియున్నవి. "కలమాజూ" గ్రంథాలయము "కళాభవనము" ను ప్రత్యేకముగా నిర్మించినది. ఆభవనమును వివిధకళలకు సంబంధించిన ప్రత్యేక గ్రంథములచేతను, పటములచేతనుఅలంకరించినారు. ౧౯౨౨ సంవత్సరమున ఒక్క జనేవరినెలయందే కళాభవనమువారు ఇరువదివేల పటములను జనులచే ఉపయోగము చేయింపగలిగిరి. పాఠశాలలందలి చిన్నబాలురకు, ఇతరవిద్యార్థులకు ఉపయోగకరముగనుండులాగున ఈకళాభవనమునందు ఎన్నియో వీళ్లు చేయబడినవి. ఈరాష్ట్రమునందు సంపన్నులగు గృహస్థులుకూడ గ్రంథాలయముల భవనములకు గొప్పగొప్ప దానముల నొసంగినారు.

ధర్మగ్రంథాలయములు గాక, ఈ రాష్ట్రమునందున్న విశ్వవిద్యాలయములకును కాలేజీలకును గలిపి పదునైదు గ్రంథాలయములును ఉపాధ్యాయులకాలేజీలకు అయిదు గ్రంథాలయములును గలవు. వీనిలో కొన్ని గొప్పవియును అమూల్యములునునై యున్నవి.

గడచిన ఏడు ఎనిమిది సంవత్సరముల లోపున ఆరాష్ట్రమందలి గ్రంథాలయభవనములకుగాను కొన్ని కోట్ల రూపాయలు ఖర్చుపెట్టబడినవి. వీనిలో గొప్పది యగు "డెట్రాయిట్" పట్టణ గ్రంథాల

యము, తొమ్మిదికోట్ల రూపాయల ఖర్చుతో నిర్మింపబడినది. ఈ గ్రంథాలయభవనము ౧౯౨౧ సంవత్సరములో పూర్తియైనది. ఈ భవనము గొప్పగ్రంథముల సముదాయమునేగాక, కళాశాఖను గూడ భరింపగలదు. ఈ "డెట్రాయిట్" గ్రంథాలయ శాఖయగు "జాగామంటీత్" గ్రంథాలయభవనమునకు రమారమి ఏడులక్షల రూపాయిలు వ్యయమైనది. "మీచిగాన్" విశ్వవిద్యాలయభవన గ్రంథాలయమునకు అర్ధకోటి రూపాయల వ్యయముతో భవనము నిర్మించబడినది. ఇది ౧౯౨౦ సంవత్సరములో ముగింపబడినది. "ఆన్ ఆర్బరు" విశ్వవిద్యాలయ గ్రంథాలయమునకు "విలియం క్లీమెంట్సు" అను మహాదాత తన అమూల్య గ్రంథసముదాయము నంతను ఒసంగుటయే గాక, వానిని ఉంచుటకు ఆరులక్షల రూపాయల వ్యయముతో ఒక భవనమునుగూడ నిర్మించియున్నాడు. అయిదులక్షలరూపాయలు మొదలు పదునైదులక్షల రూపాయలవరకు విలువగల గ్రంథాలయ భవనములు, "హైలాండుపార్కు" గ్రంథాలయము, "డియర్ బార్న్" గ్రంథాలయము, "గ్రాండురాపిడ్సు" లకు కడచిన మూడు సంవత్సరములలో నిర్మింపబడినవి. పన్నెండువేల జనాభామాత్రము గలిగియున్న "బర్మింగుహాము" గ్రంథాలయ భవనమునకు అయిదు లక్షల రూపాయలు వ్యయమయ్యెను; ఈగ్రంథాలయ భవనము సౌందర్యమునకును, వసతివాడలకును ఆదర్శప్రాయమని జెప్పవచ్చును. ఈగ్రంథాలయభవనము భావిఅభివృద్ధికి యోగ్యముగ నుండునటుల నిర్మింపబడినది.

౧౯౨౧ సంవత్సరము వరకును "లైబ్రరీకమీషన్" వారు ఈరాష్ట్ర గ్రంథాలయములకు సహాయము చేయుచుండిరి; ఆ సంవత్సరమునం దాసంస్థ ఎత్తివేయబడుటచేత రాష్ట్రగ్రంథాలయమువారు "అభివృద్ధిశాఖ"ను ఏర్పాటు చేసినారు. ఈఅభివృద్ధిశాఖవారు అమూల్యసహాయము జేయుచున్నారు. అభివృద్ధిశాఖక్రింద ముగ్గురు పరిచారకులుగలరు. గ్రంథాలయనిర్మాణమునందేమి గ్రంథముల నేరుకొనుటయందేమి, ఇంకను పలువిధములగు గ్రంథాలయ ధర్మములయందేమి ఈపరిచారకులు అమిత సహాయమును

జేయుచున్నారు. రాష్ట్ర గ్రంథాలయమువారు, ఇతర గ్రంథాలయములకేగాక ప్రత్యేక వ్యక్తులకును గ్రంథములను, గ్రంథసముదాయములను, సంచార గ్రంథాలయములనుగూడ ఎరువిచ్చెదరు.

గ్రామములకు సహాయము చేయుటకుగాను తాలూకా సంస్థలు యేర్పడి పనిని ప్రారంభించినవి. ఇట్టివి నాలుగు గలవు. ఇందులో రెండుసంస్థలు పదునాలుగేసి గ్రామములకు గ్రంథములను సప్లయి చేయుచున్నవి. మూడవది ఇరువదిమూడు గ్రామములకు, నాలుగవది పదునేడు గ్రామములకు సప్లయిచేయుచున్నవి. మొదటి రెండింటియందును సంచారమునకై ఒక్కొకదానియందు ఆరువేల గ్రంథములుగలవు. మూడవదానియందు పదకొండువేలును, నాలుగవదానియందు ముప్పదియారువేల గ్రంథములును గలవు. ఈ తాలూకా సంస్థలు నియమిత కాలములయందు వానికొరకై ప్రత్యేకముగ నిర్మింపబడిన మోటారుకారులయందు గ్రంథములనుంచి, గ్రామములకు బంపి, క్రొత్తగ్రంథములను ఎరువిచ్చి, అదివరకు వారుచదివిన గ్రంథములను తీసికొనెదరు. ఈరీతిగా ఆగ్రామస్థులకు అమూల్యమగు సహాయము చేకూరుచున్నది.

---

# సోవియటు సమ్మేళన గ్రంథాలయము.

"రష్యా" దేశమందున్న "లెనిన్‌గార్డు" పట్టణమందలి ధర్మ గ్రంథాలయము ప్రపంచమందున్న గ్రంథాలయములలో రెండవ స్థానము నలంకరించుచున్నది. ఇందు ౪౫,౦౦,౦౦౦ గ్రంథములున్నవి. దీనికి మాతృకయగు సామ్రాజ్యపౌరగ్రంథాలయము క్రీ. శ. ౧౭౯౫ సంవత్సరమున స్థాపింపబడినది. అది ౧౮౧౪ సంవత్సరమునుండి పౌరుల ఉపయోగముకొరకు విడువబడినది. సోవియటు సమ్మేళనముయొక్క వివిధప్రాంతములందు ప్రచారమగు అన్నివిధములగు గ్రంథములును ఇందు భద్రపరుపబడుచున్నవి.

ఇది విజ్ఞాననిధి; విద్యాప్రవర్ధకశాల; పరిశోధనాలయము; ప్రజలందరును దీనిని ఉపయోగించుకొనవచ్చును. ఇందు యువక గ్రంథా

లయముకూడ ఉన్నది; ఇది ౧౯౨౫ సంవత్సరమున స్థాపింపబడినది. ఇప్పుడీ యువకశాఖయందు 17,000 గ్రంథము లున్నవి.

"మాక్సిమ్ గోర్కీ" అను పేరున విప్లవదినములలో స్థాపింపబడిన ప్రపంచ విజ్ఞాన గ్రంథాలయము కూడ ఈ ప్రతిష్ఠాపనయందే యున్నది. ౭౨,౦౦౦ గ్రంథములుగల ప్రభుత్వపు ప్రచురణశాఖ కూడ ఇందేయున్నది. ఈ గ్రంథాలయము ఉదయము ౧౦ గంటలనుండి రాత్రి ౧౦ గంటలవరకు తెరచియుంచబడును. ఇందు ౨,౦౦౦ మంది ప్రజలు ఏకకాలమున చదువుకొనవచ్చును. ఈ గ్రంథాలయము నందలి గ్రంథవిభజనపట్టిక (క్యాటలాగు) కార్డుప్రణాలిక ననుసరించి యున్నది. ఈకార్డుప్రణాలిక ననుసరించి తయారు చేయబడిన గ్రంథ విభజన పట్టికయందు 50 పెట్టెలున్నవి. ౧౯౨౬ సంవత్సరమునం దీగ్రంథాలయమునందు ౯,౧౨,౨౭౭ గ్రంథములను ౧౨,౭౭,౭౪౮ మంది చదువరులకు ఎరువీయ బడినవి.

---

## శ్రీ శారదా పుస్తక భాండాగారము

నాగిరెడ్డిపల్లె, కదిరితాలూకా.

ఈ పుస్తకభాండాగారము 1923 సంవత్సరమున 100 గ్రంథములతో ప్రారంభింపబడినది. ఈ సంఘాధ్యక్షులగు శ్రీయుత మాచిరెడ్డి వెంకటస్వామిరెడ్డిగారి నిరంతరకృషిచే తొమ్మిదినూర్లు గ్రంథరాజములు, సంపాదింపబడినవి. ఆరుపత్రికలు తెప్పింపబడుచున్నవి. కదిరి నివాసులగు శ్రీయుత మొగిలి సాంబయ్యశ్రేష్ఠిగారు నూరు రూపాయల వెలగల గ్రంథములు రెండుబీరువాలు తెప్పించి యిచ్చినారు. ఇదిగాక ఈ గ్రంథాలయమునందుండు గ్రంథములజాబితాను అచ్చొత్తించి యిచ్చినారు. తిరిగి వారమురోజుల క్రిందట పదిరూప్యముల వెలగల గ్రంథములు తెప్పించి యిచ్చినారు. ఇకముందుసహా యిదేవిధముగా సహాయము చేయుటకు సిద్ధముగా యున్నారు. ఈ మహాశయునకు భగవంతుడు ఆయురారోగ్య ఐశ్వర్యమును ప్రసాదించుగాక.

ఈ గ్రంథాలయమునకు చందాలు వసూలు చేయుటలేదు. మా గ్రామమునకుచుట్టుపట్లనుండు గ్రామవాసులు, గ్రంథములు సంపాదించుకొనుటకు శక్తిలేని బీద విద్యావంతులు, వారమునకు ఒకతూరి ఈ గ్రంథాలయమునకు వచ్చి ఉచితముగా గ్రంథములు తీసుకొనిపోయి చదివి తిరిగి వాపసు చేయుచున్నారు. అట్లు గ్రంథములు వాపసు చేయని మహాశయులకు ఈసంఘాధ్యక్షులు స్వంతకూలిమనిషిని పంపి వాపసు తెప్పించుకొనుచుందురు. ఈ గ్రామమందుండు విద్యార్థులు ప్రతిరోజు సాయంత్రము గ్రంథాలయమునకు వచ్చి గ్రంథములు పత్రికలు, సంచికలు శ్రద్ధాభక్తులతో చదువుచుందురు. ఈగ్రంథాలయ అధ్యక్షులు ప్రతిదినము రాత్రిపూట 8 గంటలనుంచి 11 గంటలవరకు చదువురానివారిని చేర్చి గ్రంథకాలక్షేపణ జరుపుచుందురు. ఈ గ్రంథాలయమునకు యేవిధమైన ద్రవ్యసహాయము లేదు. ఇతర ద్రవ్యసహాయము లేకపోయినప్పటికి ఈ సంఘాధ్యక్షులు నిరుత్సాహులుగాక తమ స్వంతద్రవ్యము ఖర్చుపెట్టుచు యీ సదుద్యమమును విడువకుండా పరోపకారార్థము పాటుపడుచున్నందుకు భగవంతుడు వీరికి ఆయురారోగ్య ఐశ్వర్యములు ప్రసాదించుగాక.

## శ్రీఆంధ్రరత్న గోపాలకృష్ణ గ్రంథాలయము.

విశాఖపట్నం జిల్లా, పొందూరు గ్రామమున 17-8-28 తేదీన ఆంధ్రభాషాభిమానులగు మహనీయులచే ఈగ్రంథాలయము కీర్తిశేషులగు ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాల కృష్ణయ్యగారి జ్ఞాపకార్థము ౬౦౦ గ్రంథములతో స్థాపింపబడినది. పిమ్మట 1-9-28 తేదీన గ్రంథాలయ సభ్యుల ప్రథమ సమావేశము గూడి నిబంధనాదికమును ఏర్పరచి గ్రంథాలయమును యథాక్రమంబున నడుపుచున్నారు.